# సూచిక

శ్రీ మాజేటి రామచంద్రరావు బావగారికి

# అప్పగింత

బావా! కావ్యకుమారి నందుకొన రావా! ఇంత నైయోగమా?
శ్రీవాల్లభ్యము బుద్ధిమత్త సుకళాశ్రీసేవ ఆంగ్లాంధ్ర భా
షావైదగ్ధ్యము బంధుమిత్ర హిత విజ్ఞ ప్రాపకత్వమ్ము త్వద్
గ్రీవాలంబిత హారవల్లరులుగాఁ గ్రీడింతు నా మ్రోలనా?

చెల్లెలి బంధమున్ గడనసేసి జగమ్మున వియ్యమందఁగా
జెల్లును, బావగాని యొక చిత్రపు బావపు నాకు భావనన్;
'అల్లుఁడు గాఁడ నీ కయొ మదాత్మజుఁ' డంటివి, కాకయుండనే
చెల్లిన పెద్దవియ్యమును జేసితి నీమెయి రామచంద్రమా!

వియ్యము నెయ్యము కయ్యము
వెయ్యాఱులు సేయు సములు బెరసిన యపుడే!
తియ్యము గల యెదకున్ సరి
తియ్యని కబ్బమ్ము నిచ్చితిని, రసలుబ్ధా!

మోయఁగరాని తీపిఁ జిఱు బొజ్జను నింపిన తేనెపట్టు, కై
సేయు మెఱుంగు క్రొన్ననల సెజ్జ, బెడఁగుల నంచ కొజ్జయై
డాయఁగడంగు వన్నియ తుటారపుఁగత్తె, రసజ్ఞమంచు నీ
దాయిలు మెట్ట నంపెదనయా! చిఱుకోడలి నెట్టు చూచెదో?

హద్దును పద్దులేక పలుకాడెడిగద్దరి గాదు, కబ్బపున్
విద్దెలలోని యొద్దికయు, వేల్పు పడంతుక చెల్మికల్మిలో
ముద్దును, గైవసంబయిన ప్రోడయ గాని; నినుం దరింపఁగా
దిద్దుకొ గాదు వంగడము దిద్దు, యశమ్మొసగించు బావరో!

గ్రంథాలయ సంస్థాపక!
సంధానిత జనపదాంగసముదయ శీర్షా!
గంధవతీ వ్యవసాయక
గంధగజా! దృశ్య రంగ కమనీయాంగా!

---

# లుంపనము

భారతదేశపు మొగలు చక్రవర్తికి నలుగురు కొడుకులు,— దారా, షుజా, మురాదు, ఔరంగజేబు.

తాజమహలు చూచుచుఁ దుది యూరుపు పుచ్చు నదృష్టము నర్థించి షాజహాను 'దారా' సహితుఁడై 'ఢిల్లీ' నుండి 'ఆగ్రా'కు వచ్చి యందుండెను. 'ఔరంగజేబు' ఆగ్రాకోట ముట్టడింప వచ్చుచుండగా 'దారా' యెదురుచని శంభుగడమున మార్కొనెను. అందు 'దారా' యోడి యాగ్రా చేరి తనమొగము తండ్రికిఁ జూపనోపక వెడలి పోయిన కథ యిది.

ఆ నిర్ణీత దినమ్మునం దుదయ సంధ్యా భాను రోచిస్సు వా
ర్తా నాదమ్ముల తోడఁ బ్రాఁకె నఁట యాగ్రా వీథికా శ్రేణులన్
"శ్రీ నృత్యాంక మయూరలాంఛన కనత్సింహాస నారోహ రే
ఖా నవ్యప్రభ లేముఖానఁ గలవో కా?" యంచు లోలోఁ బ్రజల్.

పోర నౌరంగ దారాలఁ బోల్చి కొనుచు
కనుకలిమె లేక వినుకలి కట్టుకథల
జయ రమా కాంతు నెటుల నిర్ణయము సేతు
రాముహూర్తము డగ్గఱు నంతదనుక.

తనయ సమీక వృత్త నిరత శ్రవణైక పరాత్మ మానసం
బున నిముసమ్ము కల్పముగఁ బుచ్చెడి వృద్ధుఁడు షాజహాను చిం
తనమున మున్ని వార్తలు వినా విననోపఁడ యన్య శ్రవ్యముల్
కను లెఱసంజ జీర లురలం గను, మూయఁడు, నీరసంపదన్

శశికాంతోపల రమ్యవహాచు యమునా సారాంబు ధారార్ద్ర మం
ద సమీర ప్రసరాతి శీతమగు తత్ప్రాసాదపున్ సీమ ను
ల్లసి తోత్త్రాలము హంస తూలమయి లీలందేలు డోలాస్థలిన్
సని చెందం డతఁ, డాధి వ్యాధిఁ బొదువన్ సంధించెనో వానికిన్?

ఆత్మ దృక్కంజములు గవాక్షాంతములకుఁ
బెనచి యొదిగి యాతాయాత జనముఁబిలిచి
"ఏమి వార్తలు? దారా జయేందిరా ద్వి
తీయుఁడై వచ్చెనే?" యంచుఁ జేయుఁ బృచ్ఛ.

క్రుంకు రవితోడ నాసలు క్రుంకుటయు మ
నోంబుజము ముచ్చ ముకుళింప నలమటించి
కత్తి చెఱివిన నెత్తురు క్రమ్మఁబోని
మోముతో డిందుపడిపోయె ముసలి ఱేఁడు.

తిమిర మిలఁ బ్రాఁకె జాము రాతిరి గతించె,
మలయ పవమాను నూయెల సొలసెఁ బురము
ముసలి దొర యొక్కఁడే కన్ను మూఁతపడక
యట్టె మల మల మఱఁగెడు నంతలోనె.

ఎగిచిన సాగి యొత్తి సకిలింపఁగ నోపనివై ఖురస్వనం
బెగయఁగఁ జేయలేని వయి యెద్దిన శత్రుిల యీ బెపోటులం
దెగి చెమరించి వెల్లువలు తీర్చిన నెత్తుటి మేనులంది నూ
ల్తెగు మణిహార మట్టు లరుదెంచెను వాజులు రాజమార్గమై.

అత్తురఁగంబు లాఁగుగృహమందు ననేక విపంచు లొక్కమా
ఱొత్తినఁ బంచమస్వరము లొక్కటియై లపియించు రీతి నె
ల్లెత్తిన రాణివాసరవ మేచుచుఁ గ్రొంజిఱుగాలి పొత్తునన్
మెత్తనమెత్తనై కరఁగి మెల్లఁ బురాంగణవీథిఁ బర్వినన్

విని వృద్ధపతి మహాశని
వినిపాతము సెంది పుడమి విడిలిన భంగిన్
మనము పఱియలై ఘూర్ణిలఁ
గనుమూసెను మోము కప్పు కవిసి యవశతన్.

కోఁతల నెంజిలుల్ పఱియ గొల్పఁగఁ గోత్తలసేయ నాధిబా
ధాతప తప్తుఁడోర్వ నెటులో? కమలెం, గుమిలెం, బదమ్ములుం
జేతులు సెజ్జమోపఁడు, ప్రశీతల వాత సుగంధ సేవలం
జేతము చల్లఁగా నిదురసెందఁ,—డిఁకన్ సుతుమందిరమ్మునన్

ఒడలిపైఁ గత్తులు పడిన చోటులు చూచి
ప్రథమ చికిత్స చేపట్టు వారు
దోన దోన గాయముల్ తొరఁగు రక్తము దోయి
లించి కట్టులను బిగించు వారు
సలపరింతల మేను నులివెచ్చ నీటి తూ
లములతో నెడనెడ నిమురు వారు
మెలమెల్లఁ జామరమ్ములు వీచి దవు దవ్వు
లన నిల్చి కనుమోడ్చి కునుకు వారు

పరిచరులు, కాని దారాను బరిభవమ్ము
దక్క నొండొక బాధ సెందదు, యతండు
కన్ను లుండియుఁ గనఁడ యాసన్న జనము
శ్రవణ ముండియు వినఁడ 'ఓ' యన్న రవము.

తనకే తానొక దొంగఁగఁ
దనికెడు నభిమానధనుని దటియుచు వినయా
వనతుఁడు సేవకుఁ డొయ్యనఁ
గని వ్రాలి సలాము సేసి కమ్మ నొసంగెన్.

దీర్ఘ నైదాఘ తృష్ణకుఁ దియ్యనీరు
గాఢనైశీథ బహుళాంధకారపటలి
నొత్తిగించిన యొసపరి యొరపు మెఱపు
జనక ముద్రిక గని విచ్చి చదివె నతఁడు.

''తనయా! దార! విషాదహేతువయ యేతద్వృత్త, మేనిష్కృతిం
గన సాధ్యమ్ము? బలీయమా విధి; పురాకర్మమ్ము భోక్తవ్య, మే
మననేర్తుం దొలుదొల్లిపట్టి వమొ! స్వామ్యంబైన రాజ్యంబు నీ
కని యిచ్చింపక యుండెనో విధి; యిఁకేమై యుండునో నీగతుల్?

లేదనుపో కుమార యిఁక లేదను, వార్ధి హిమాచలేంద్ర సం
పాదిత రత్నమౌక్తిక రమాకర భూవనితా కరగ్రహ
శ్రీదరహాస రేఖయె, యిసీ! మరణోన్ముఖుఁడైన నాకునున్
లేదనుకొందు నీ కవుఁగిలిం గొని దేహమురాల్చు రేఖయున్.

'కల బలమెల్ల శంభుగడ ఘట్టనముం బొనరించి యగ్రజుం
డలసిన చిన్నసేన గొని 'యాగ్ర'కుఁబోయె,నితోఽధికోత్థితో
జ్జ్వలబాహుఁ డౌలకుర్గమును నిజప్రథితోగ్ర బలోర్మి కోర్జిత
ప్రలయము సేసి తత్పురము రాల్చెద' నం చవురంగుఁడెంచెడెన్.

తీఱని కసి నాపయిఁ, జ
ల్లాఱని పగ నీపయిఁ, బొగలారెడు 'నాగ్రా'
తేఱుట కల్లయ, నన్నొక
మాఱెద హత్తుకొని పో, కుమారా! దారా!

నిర తానంద కరేందు
స్ఫురి తామృత బిందువులకు సోదరములు త్వ
త్తరళీకృత లోకనములు
పఱపుము ర మ్మనుచు బిగియఁ బట్టితిఁ దండ్రీ!''

అని వాత్సల్యము చాలుగట్టు పితృలేఖార్థమ్ము కందమ్ములఁ
వినువాకల్ నిపతించి చూచి దెసలఁ వీక్షించి యాతండు తోఁ
మునుకోఁ సిగ్గుతెరల్ తెమల్చి కరుణాస్ఫూర్తుల్ ప్రకోపింపగా
వినతుండై ప్రణమిల్లి పల్కెఁ బిత, కుద్వేగమ్ము మైకొన్నటుల్.

"కోశద్వారము తీసి హేమకణికల్ కొల్పించి రూప్యమ్ములున్
రాసుల్ వోసి సమస్తధాన్యములు ధారాపూరముల్ సేసి ది
గ్దేశాయాత శతఘ్నికా శకట సందీప్తోగ్ర సైన్యమ్ముతో
నాకిన్నిచ్చి జయార్థ మంపితివి న, న్నవ్వెల్ల ధ్వంసించితిన్.

చతురంగ వాహినీచయ జలప్రలయమ్ము
నతని యా చిఱు బోదె యంగవించె
రసపుత్రవీర ధరాధర ధైర్యమ్ము
నతని యా చిఱువాక యప్పళించె
తత తనూ రక్త సంతర్పణాస్థాన జీ
వనుల నా చిఱుమూక యణఁచివైచె
అనవద్య ధన ధాన్య మణి ధునీ వాహమ్ము
నతని యా చిఱుసీతి యాహరించె

బలము విడియుట మొన పన్ని బలసి చనుట
అరుల నఱిముఱి పఱచి పై కుఱికి నఱికి
చెరిగి బీభత్సు సేయుట యెఱుఁగ లేక
దీలుపడి పోతి నవురంగు తెలివిముందు.

''జయమో చావో? తృతీయమొల్లఁ బ్రభుసంస్థానార్థ మీ దేహ మేన్
వ్యయముం జేతు'' నటంచు వీరమరణం బందెన్ సమీకప్రవే
క యశం బంది, యితఃపురార్ధశత సంగ్రామ వ్రణాళ్యంకితా
వ్యయ దేహమ్ముఖ, రావు ఛత్రసలు సైన్యాధ్యక్షుఁ డీనాఁటికిన్.

పరమ దయామయా! భవ దపార కృపారస వర్ష వీచికో
పరమయి, నష్టజాతక దృషత్తయి, వర్ణవిహీనమై, కళా
విరహితమై, మయూరముఖపీఠ కపూర్వ కళంకమై, యిసీ !
పఱియలు వడ్డ యీదృశపుఁ బ్రాయిఁడిమో మెటునీకుఁ జూపుదున్?
చనుదెంచున్ నిజ మామహోపశదుఁ డిచ్ఛాపూర్తి సంరంభియై
చనఁ బంచున్ నిజవాహినిన్ సమర నిస్సాణమ్ము లాగావృకీ
కుసనభో మండల చండమై విఱియఁగా, గొఱ్ఱెల్ గదా భూప్రజల్!
చని వానిం గొలువుండి నిల్తు, రిఁకపై సర్వమ్ము నిర్వాహమా!

అరుణదుర్గప్రభాహారి యాగ్రాపురం
బతఁడు ముక్కలుసేయ నాఁగలేను
కరుణాసరోయాన కలహంసమవు నీవు
వానికత్తికి మ్రొగ్గఁ గాన లేను
పాల్గాఱు చెక్కిళ్ల పసి నిసుంగుల గొంతు
కసకసల్ కన్నారఁ గాంచ లేను
అభిమానధన సహస్రాంతఃపురాంగనా
మానాపమతి చూచి మనఁగ లేను

'ఏమిరా! యనాయాస సంక్రామి తైక
రాజ్య పరిపాలనాశ, దోర్దర్ప మిచట
నెఱపుదే? ముక్తి రాజ్యమ్మె నీకు నిత్తు,
నీయరా! కంఠ'' మన వ్రాలి యీయలేను.

చనియెద నెందే జనకా!
మును నను రణమునకుఁ బంపు మును కంబము నా
న్చిన నీ యశ్రు ముఖాబ్జం
బును గనుటే తుది విలోకమో నాకుఁ బ్రభూ!

సెల'' వని మ్రొగ్గతిల్లి పనిచెం బిత్పృసేవకునిం, దొడిం జనెన్
వెలి, మునుఁగంచులం దఱపివెన్నెల గాచియుఁగాయలేని యూ
ర్తులు శిశుపంక్తితోఁ జొఱఁగ అంపిలు పేటికలన్ గజాలిపై
నిలిపి నిజాశ్వ మెక్కి పయనించె నతండు గజానుగామియై.

డిల్లంబోవుచు, నోరు క్రొన్నురుగు వెండిన్ దారముల్ దీసి, మే
నెల్లం జెమ్మట ముత్తెముల్ తుఱుగు నశ్వేంద్రం బతండెక్కెరాఁ
బల్లిపక్కణ పత్తనాల్ చొఱక పార్శ్వాల్ పట్టి యెట్టెట్టులో
'ఢిల్లీ' చేరెను పేటికా ఘటిత కోటీరేంద్ర భద్రేభముల్.

# మిత్రభేదము

ఔరంగజేబు దారా నుండి తత్సైన్యాధ్యక్షుఁడగు 'దాదూఖాను' ను విడఁదీయఁ దలఁచి, 'దాదూఖాను' పేరఁ గపటలేఖ నొకటి వ్రాసి 'దారా' చేతఁ బడ జేసెను. 'దారా' యా యెత్తులోఁ బడిన కథ యిది.

వలపుచక్కెర లేఁతపాకంపుఁగెమ్మోవి
చవులఁ జిందింపంగ సాగువారి
బిగియారు చనుదోయి వీఁగి కంచుక మంచు
ముడి వ్రీలఁ గౌఁగిలి నడుగు వారి
ఉలిపొర మేల్ముసుంగులను దోబూచాడు
మొగము వెన్నెల వాఱఁ బోయువారి
సన్న జాజుల చూపు సరులతో మల్లెమొ
గ్గల నవ్వు గ్రువ్వి పొంగారు వారి

నెనరు విడనాడి నటికి మొండెములు తలలు
పచ్చి నెత్తురు టేటి తెప్పలుఁగఁ ద్రిప్పి
రాజభక్తికి రామానురక్తి బలిఁగ
సంగముక్తుండు దాదుఖాన్ సాగివచ్చి

"ఓ ప్రభూ! నమ్ము, దారాప్రభూ! కృతఘ్న
సర్పహారమ్ము దాదువంశమ్ము గాదు
నమ్మువారి రక్షాబంధనమ్ము గాని;
నన్ను నమ్మవో నీవు నిన్ నమ్ము" వనఁగ,

''ఇదియేమిూ! యొడలెల్ల రక్తఝురి; నీయీఖడ్గ ముగ్రమ్ముగా
గుములున్ నెత్తురు గ్రక్కు నీ యరుణదృగ్భాజ్వాల ఝుంఝుంకృతిం
బ్రిదులున్? నీవెడ కేఁగి యొక్కనిముసంబేన్ గాదు, విస్ఫార మే
మిది దాదా!''యనినివ్వెఱంపడుచు స్తంభించెం బ్రభూత్తంసుఁడున్.

''కాంతా కనకములం దిహ
మంతయుఁ బడిచచ్చుగాదె? యందును గాంతా
సంతానముకై కనకము;
కాంతల నంతంబు సేసి కదలితి రాజా!

ఇఁక నే నెవ్వరి కోసము?
సుకములు సురిగించి సేవఁ జొచ్చితి, నన్నీ
విఁకనైన నమ్మ వలదే?
కకవిక కానీకు మనసు, కలఁత యుడుగుమా!

ఎద మది త్వత్పిత్రాణమునకే వెలయిచ్చితి, నెమ్మిగద్దె నీ
యుదయముఁ జూచుదన్క విడనోపను నాప్రభు! తండ్రి'' బాబునున్
వదలకుమా!'' యటంచు ననుఁ బంపెను గక్కుఁగ, నోట్టుపెట్టి నేఁ
గదలితి, నెట్టు లాప్రభుముఖంబును జూతు''నటంచు నూర్చుచున్

నెత్తు రోడికలుగా నిగనిగ లాడెడి
కత్తినిఁ బ్రభు పదాగ్రమునఁ బ్రోసి
నెమ్మి గద్దెకు నెత్తు రమ్మిన గాయాల
ఱొమ్ము దారాప్రభు ఱొమ్ము నాన్చి
పోఁబకథల్ విప్పి ముడుతలం బూడిన
మొగము గంటులు దొరముఖముఁ జేర్చి
ఆజానులంబమూ నాయతబాహుదం
డములతో నాలింగనముఁ బొనర్చి

దొన దొన యనంగ బాష్పవాఃకణము లురలి
గుంట చెక్కిళ్ళఁ బడి తెరల్గొనుచుఁ బొరలి
నరసి నరయక యుంగరాల్ తిరుగు గడ్డ
ముననుఁ దేలఁగఁ బురపుర పొక్కె దాదు.

కరఁగి హృదయము మలమల మఱఁగి పోవఁ
దిరిగి కళవళమంది బుద్ధియుఁ జలింప
రెంట నిదమిత్థ మని యేర్పరింపలేక
యెద మదుల మధ్య నడవడ గదిరెఁ బ్రభువు.

"తాతలనాఁటినుండి ప్రభుదాసుఁడు'దా,' దితఁడన్నఁదండ్రికిం
జేతము చెమ్మగిల్లుఁ, బ్రభుచిత్తమె విత్తముఁగా గడించు వి
ఖ్యాతచరిత్రుఁ, డింతవడి కస్మదసుప్రకరంబుగాచె, మే
ల్చేతకు బద్ధకంకణుఁ, డిసీ! తనకాంతలఁజంపె,నైననున్

అవురంగుండు రచించులేఖ యనుమానావిష్కృతిన్ సల్పు, నా
నవు! నీతం డిలుగుట్టు చెప్పి యరి కీయంబోలు నం బట్టి, రా
జవు నాతం డను నాసఁ; బెన్మ్రసలి పల్కాలించి నంబట్టి చా
వెవఁ డాసించెడి తోడియోడ గతి?-కానిమ్మాతనిన్ వీడెదన్’’

అనుచు దురదృష్టరేఖ ముం దడుగువెట్టఁ
దండ్రి నెఱగుండె దాదును దరలనడిచి
వెడఁగు నిలిచెను సిరి నిలు వెడలిచనిని
‘వలదు వల’దని ‘నాదిరా’ పలుక వినక.



# అరణ్యారోదనము

'దారా' సకుటుంబముగఁ బరివారముతో ఆఫ్గనిస్థానము చేరుచుండఁగనే భార్య 'నాదిరాబాను' మరణించెను. నాఁటి దారా యరణ్యారోదన మిందు సూచితము.

పశ్చిమమ్మున నరుణిమ ప్రాకి ప్రాకి
నల్లనైర వ్రాలె, రేకజాబిల్లి తోఁచె,
వెల్ల మొగముల దారాసిఫీరు లుడుక
'నాదిరా' కన్నుమూసెఁ బ్రాణములు తరలె.

"ప్రణయస్వైరవిహారహారిణి, కళారంభ ప్రబోధస్వరూ
పిణి, మజ్జీవన సేచనైక సుమ మాధ్వీసార సంతర్పిణీ
ప్రమత్తానందతరంగ కైరవిణి, మద్భాగ్యోదయ ప్రాగ్దిశా
మణి, కన్విప్పవ? యంధలోక మిది యస్మజ్జీవికాపాలికా!

అచ్చము నీ కనీనికలె, యచ్చము నీదు కపోలయుగ్మమే
యిచ్చితి నీ'సిఫీరు'నకు, నిట్టి కనుల్ నులివెచ్చ నీరముల్
పుచ్చ వలంతులే? యరుణపూర్ణములానొకొ యిట్టిచెక్కిళుల్?
గ్రుచ్చి కవుంగిటల్ సుతుని గూర్చవ? తేర్చవ? కన్నువిప్పవా?

లోకుల్ ప్రేముడి నింపిరేఁ, పిత దయాళుండేని, సంబంధు లు
త్సేకానందము నీయనీ, యెవియు మాతృప్రేమ చంద్రప్రభా
నీక స్పర్శల కీడువచ్చుచు సుతానీకమ్ము రంజించునే?
నీ కన్విప్పని లోక మీసుతున కంధీభూత మో నాదిరా?

ప్రజ్ఞా దివ్య గభస్తి మండలికిఁ బ్రోపై, రాజ్యతంత్రాంగ స
ర్వజ్ఞత్వమ్మున దారితీయఁగల ప్రాపై, భూపరేఖాంక లో
కజ్ఞ ప్రాభవమూర్తి నేనయిన దక్కన్ నిల్వఁగా నోపనో?
రాజ్ఞిత్వమ్మిఁక లేదులే యని 'నదీరా' పైనమైపోయితో?

ఆశయె జీవనంపుఁబోడిమై నిలుపంగల దందు, రాశయే
లేశము నిన్ను నిల్పుకొనలేద! మదాశయపూర్తి నీవ కా!
ఆశయె నాశమైన విభుతాశయమేల? త్వదాస్య చంద్రరే
ఖా సితశీతలప్రభలు కాయని మత్ప్రభుతల్ నిశీథముల్.

భారతీయ రాజ్యప్రభుత్వమ్ము కన్న
త్వత్ప్రణయ రాజ్యపాలకత్వమ్ము మిన్న
దాని కయి దీనిఁ గోల్పోవు వాని కన్న
దీని కయి దానిఁ ద్యజియించు జ్ఞాని మిన్న.

ఆనాఁటి నవమాధవాగమ కమనీయ
వనవిహారములె శాశ్వతము లనుచు
ఆనాఁటి యితరేతరానుషంగానంద
సంభాషణములె శాశ్వతము లనుచు
ఆనాఁటి హృదయవీణాలాప మాధురీ
స్పందన క్రియలె శాశ్వతము లనుచు
ఆనాఁటి చిత్రరేఖా నవోన్మిషిత భా
వ ప్రసంగములె శాశ్వతము లనుచు

జీవికాజీవులము రెండు సేయఁబడని
సిద్ధమూర్తుల మనుచు నెంచితిమి తొల్లి
లోకయాత్రాప్రవాహ కాష్ఠాకృతులుఁగ
మన బ్రతుకు లయ్యె నేమిచెప్పను నదీర!

చలువరా పలక సోకుల కోర్చి యోర్వని
నిను నెఱారుల యావిరినిఁ గుమిల్చి
రేవెలుఁగారు దారినిగాక చనలేని
నినుఁ గాలు చిచ్చుటెండనుఁ గమల్చి
బహుహంసతూలికా పల్యంకయాన నిం
జేటికాన్యస్త గావించి తెచ్చి
ఎడమీఁక పువుఁదేనె లించు నీ నాలుక
తడియార్చి నీళులేనిడక యెడపి

నిలువనీయక యలసట దొలఁగనీక
నిదురపోనీక గుండియ కుదురనీక
శల్యమాత్రావశిష్ట కౌషధమునీక
నిలువునం గొంటి నీయూరుపుల నదీర!

* తనయురోగము తన్నుమొనయ వేడి ఫలింప
బలియైన పితరుఁడు బాబరునకు
అభియోగ జుష్టయౌ నర్ధాంగికై ప్రాణ
మరివెట్టు తాత జహంగిరునకు
ముంతాజిసతికి సొంపుల తాజి యుడుగర
సాధించి యిడిన మజ్జనకునకును
పత్నిపోవఁగ మట్టిపనికేని కొఱగాక
యొడలోము పూన్కిమైనున్న నాకు

రక్తమొకఁడయ్యుఁ ద్యాగాన రాదుపోల్కి
వంశ గౌరవ కార్శ్య క్రమాంశ కవధి
షాజహాన్ గర్భకుహ రాగ్రజాత మృగము
మత్కుల ప్రభుచంద్ర బింబమ్ము మచ్చ."

అనుచున్ శోకము మూర్తిని
గొను దారా వెలికిఁ బలుకు కుదులని కుసిలిం
పున రాపడి చూచిన చూ
పున నాకస మిఱియ మోము పుల్లసిలంగన్.

"కనుచూపుల్ కునుకాడి మూఁగవడి సోగల్ గాఁగ మత్తన్విలో
గొణుగుల్ వాఱిన కంఠసీమఁ దుదిపల్కుం దెచ్చి 'మద్భారతా
వని మట్టిన్ ననుఁ గల్పుఁడీ!' యనుచు నం బ్రార్థించి కన్మూసెఁ, గై
కొనిపో మోహ్మ మహమూదు, పున్నమిదినీకుం దక్కఁగానుండెఁబో !

ఏలఁ బుడమియుఁ గొలువుండ నిందుముఖియు
లేని దారాకు బలమేల? రాణ యేల?
'పార్స్యజీశ' సుతా కళేబరము తోన
చనుఁడు మగుడకుఁడు పదాతి సర్వబలము!

మీమీసతులు వియోగపు
బాములు పడనోడి విడుచు బాష్పోష్ణకణ
ప్రామాణ్య మిట్టు కుడిపెనో?
యేమో! చనుఁ డగడు లేల యీవ్యర్థునితో?"

అని చైతన్యము దక్కి నిల్వఁబడి బొమ్మై పోయినన్ ఖిన్నుఁడై
మునుకొంచున్ మహామూద్సలామని శిరంబున్ వంచి బాష్పప్రవా
హిని ధారాగతి సెంద 'నాకు సెలవా యేగన్? పునర్దర్శనం
బన నింకెప్పుడో యెచ్చటో ప్రభువరా! పన్వెందు' నం చాడినన్.

రాపడిన రూపు తేలిపో నోపు చూపు
జీవకళ త్రోపువెట్ట దారా విషాద
ముబికిరా 'నదీరా' శవమ్మొరగి స్పృశించి
ఒడలు తెలియని యావేశ మడరు గొనఁగ.

"మొద లేదివ్యముహూర్తమందు మన చూపుల్ కోపులై పొందెనో?
కొదలే కద్వయ రూప నిశ్చల సుఖాంకుం డైతి నిందన్క, నా
ముదముల్ పెందుద లందె నీక్షణముతో, నీమూర్తియుం జాటగున్,
తుదిచూపియ్యదియేన నాకు? నెటులుండున్ నీవు లేకుండఁగన్.

పోదువా, పోదువా, పోదువా దయామ
యీ? యమో కొందువే కొందువే మహమద!''
యని కుమారిలి యతఁడూఁగి యవని వ్రాలె
'అమ్మ అమ్మా' యటంచు నల్లాడె సుతుఁడు.

పదికు టూనిరి తత్కళేబరము పేటి
అడుగు కదిపె మహమ్మ 'దల్లా' యటంచు
మును వెనుక ప్రక్కప్రక్కల మొనసి చనియె
పదిక సప్త శతము కళేబరము తోడ.

తెలి యెడారిని మృగతృష్ణకై భ్రమ వశ
మ్మునఁ బోయి పోయి సోలిన మృగమ్ము
సకియ పోవఁగ స్రుక్కి మొకము వ్రేలఁగ వేసి
కుపుకు వను మగ జక్కవ పులుంగు
కొలనుఁ గొమ్ములేన్గు కరాగ్రమునఁ జిక్కి
తలఁకి యూఁగిన కెంపు దామర విరి
సుడిగాలి వడిసుళ్లువడి ముందువెన్కల
కెగిరి తందరలాడు నిగుడు తీవ.

అనువు తప్పి జవ మ్మటి యసురుసు రయి
రొమొదలు తెలియ కూఁటఁ జెప్ప నొకరు రాక
పరిచరులు లేక పెనుమూర్ఛ పడిన దార
తనకుఁ దానయి స్మృతి గొని తనయుఁ జూచె.

మధుర మధూళికా సహిత మాధవ పుష్పములౌ కపోలముల్
శ్లథితములం బొనర్చి విగళ న్మృదు రుద్ధ కవోష్ణ బాష్ప వా
ర్నిధులను వాకలన్ మలఁచి నిల్చె 'సిఫీర్' జనకాగ్ర భూమి, త
ద్వ్యథగని గుండె బ్రద్దలయి బాలునిఁ గౌఁగిట హత్తెఁ దండ్రియున్.



* పుట. ౧౭. 'తనయు రోగము' అను పద్యము:—

బాబరు తన కొడుకు హుమాయూన్ బ్రదుకుటకై తన ప్రాణమిచ్చెను. జహంగీరు తన భార్యను బ్రదికించుకొనుటకై ప్రాణమిత్తు నని యీయలేదు. షాజహాను తన భార్య చచ్చిన పిదప 'తాజమహాలు గోరీ' కట్టించెను. దారా అదియుఁ జేయలేక ఔరంగభీతితో రహస్యముగ భార్య శవ మంపివేసెను. ఇట్లు తన వంశమున ప్రేమ క్రమక్రమముగ గృశించుచు దనతో నశించిన దని దారా యభిప్రాయము.

# ప్రతికృతి

దారా తలఁ దాచుకొన నెంచి పూర్వ పరిచితుఁడగు 'మల్లిక్ జీవను' ప్రాపుఁ జొచ్చెను. 'మల్లిక్ జీవన్' ఔరంగుని నయభయములకు లొంగి దారాను ఔరంగున కొప్పఁ జెప్పెను. తత్కథ యిది.

"ఓహో! వచ్చితివోయి, నాఁటి కిటు నేఁడోయీ! నినుం గంటి, నీ స్నేహం బూహకు వచ్చి నీకుఁ గబుకుం జేయింప నూల్కొంటి, రమ్మోహో! నిల్చెదవేమి కుంచితుఁడవై? యుద్యోగధర్మమ్ము ప్రత్యూహమ్మా! యుపవేశమున్ సలుపరాదో! మల్లికా జీవనా!

ఎన్నాళ్లకు నెన్నాళ్లకు
గన్నారఁగ నిన్నుఁ గాంచఁ గల్గితి! నాఁడా
పన్నుని నినుఁ జూచితి, నా
పన్నుఁగ ననుఁ జూడనీకు వలసెన్ విధిమై."

అని మొగలాయిఱేనికొడు కాతని యానన రేఖ చూచుచున్ "కొనకొని మత్ప్రియ మ్మొకఁడు కూర్పఁగఁ గోరుదు, మన్నతేఁడవై గన వల, దెంచు మిత్త్రకృతి కాఁగను, పున్నెము నీకుఁ, బ్రాణ మిచ్చిన పెనుదాత వౌదు, పరిశీలన చేసి వచింపు జీవనా!"

అన విని మల్లికుండు ప్రభు వాడిన నెయ్యపుఁ దియ్యపల్కు లాత్మను గదలించి తోనె యెడదం గరఁగించినఁ, బట్టలేని యుబ్బునుఁ బ్రకటించి "ఏమిది! ప్రభూ! మదనుప్రకరమ్ము వధ్యవేదినిఁ బడనీని వేలుపవు, దేహముఁ బ్రాణము నీవి కావొకో!

రాజకీయాపరాధి నన్ ప్రభువు పట్టి
గజపదాఘాత మరణ శిక్షను విధింప
మృత్యుముఖమును దప్పించి తీవు దేవ!
మఱతునే జీవ మున్నంత వఱకు నిన్ను."

అని వినయము నయము భయము
పెనఁగొన దోయిలినిఁబట్టి పిఱు తివియని దీ
క్షనుఁ బ్రకటించిన మన్నియ
పెనుపున దారా కెరలియుఁ బిఱువీఁకు పెదన్.

"ఆఁగిన చోట నాగక, పయస్సులె భుక్తిఁగ, వాజి మూపుపై
నూఁగుచు కున్కుగాఁ, బదికు లూర్పులె శాపముగా గ్రహించుచున్
సాగి, యరంగుసేన కనుచాటయి వచ్చితిఁ, గోలుపోతి మ
ద్భాగపు మూర్తి నేఁడ, పురిఁబోయెను సేన, సుతద్వితీయుఁడన్.

శోకదినములు నాలుఁగిచ్చోన కడపి
విధిబల ప్రేషితుఁడ నయి వెడలి పోదు
నాశ్రయం బీయ నర్థింతు, నాత్మ బంధు
వితథకృతి మిన్న పరుల సత్కృతులకన్న.

ప్రాణము ప్రాణమైన ప్రియురాలి నరణ్య హుతాశనార్చి మ
న్మానపురక్షకంచు మఱుమాయముసేసి, దయాలసత్ పిత్ర
ప్రాణ మరుంతుదోద్యదపురంగశతఘ్నికి నిచ్చి వచ్చు నేన్
ప్రాణము కోస మెంతయభిమానము చచ్చి మఱుంగుచుంటినో!

ఉపకృతి మా యుపకృతియో
యుపకారము క్రొత్త సేతొ యొనరింపు, ఋణ
మ్ము పడిన గతి నీఁగద నే
నెపుడే" నని పలుక మల్లికేశ్వరుఁ డనియెన్.

"మానమునిల్పి ప్రాణమును మంచుకొనం దలవాల్చిరావు, నీ
పానిమనంగ భారత ధరా జన తానువు, లవ్వికాచు శే
మానము నిల్పుకోల్, నిలుపు మైకను నంతకుఁ బ్రాణగోపనన్
మానట యెట్టు? లెంత యభిమానము చచ్చిన మానరక్షకే!

ఉండు మధిప, యతిథి, వోవరుల్ నీయవి,
సన్న తెలియనీను శత్రువునకు,
నెది నీ వాసంగితో యది నీముదల నిల్పు
నాజ్ఞసేసి సేవలందుకొమ్ము!"

అని కరవాలవుం బరుజు నానిచి చేయి, శిరస్సు వాల్చి యొ
య్యన నృపుపై దృగంతము లనంతములన్ విరియించు మల్లికేం
దు్రని ముఖసీమ నాసకొన తోఁచె నిరాశను ముచ్చముగ్ని ని
ల్చిన దురదృష్టమూర్తి కొకలిప్తనె, మబ్బుగమిన్ మెఱుంగుగాన్.

లేచెను మల్లికుండు తరళీకృత హృత్సరసీజపత్ర రే
ఖా చలదైక భావలవ కంకణుఁడై, సుతుతోడఁగూడి దా
రా చనె మల్లికుండు తొడరం, దురగేంద్ర ఖురక్రమ స్వన
శ్రీచయవృద్ధి తోడను బ్రవృద్ధి గడించెడి జీవితాశతో.

కాని దినరాజు వెనుదన్ను కలువరాజు
ధర్మ సూత్రమె మదికిఁ బ్రత్యక్ష మయ్యె,
ప్రకృతిలీల సమన్వయపఱచువాని
స్వానుభవమునుఁ బట్టి సాక్షాత్కరించు.

అదె పుర మిదె దుర్గ మ్మని
కదిసిరి ప్రాసాద వీథికా నిచయమ్ముల్
ఎదురఱు భటులు సలామని
పదుపచు గుమ్మటిలి వచ్చి పజ్జను నడువన్.

హరిసమవరోహణము సేసి రమ్యాపురుసు
వెండి పొన్నుల బెత్తముల్ పిడికిలించి
తొలఁగి మాగధ సౌవిదల్లులు నుతింప
మెల్ల కక్ష్యాంతరములు క్రమించి నడచి.

క్షణమాత్రంబున డించె మల్లికుఁడు లజ్జాపూర్ణ దారాప్రభున్
తనయున్, నిర్మల చంద్రకాంత పథ మధ్యప్రాప్త శృంగాటక
ప్రణుతోద్య న్మణిమాలికా ఖచిత హర్మ్యప్రాంగణమ్మందునన్
కణుపుల్ ద్రెవ్విన యిక్షుఖండయుగమో నా వ్రాలి రాయిక్వరున్.

వెనుమరలి పరిచరులతోఁ
జనియెను మల్లికుఁడు ప్రభువు సన్నిధి విడి, స
జ్జన భోజన శయ్యా క
ల్పనముల నొల్లకయ పితయు బాలుఁడు నుడుకన్.

మరకత పద్మరాగ రుచిమ న్మణికుడ్య నిరంత దీపికా
స్ఫురిత గభస్తి మండలముఁ జొచ్చియు 'దార' హృదంతరమ్మునన్
గిరికొను చిమ్మచీకటుల క్రిక్కిరియింపులఁ ద్రోసి రాజనన్
దొరకొన లేఁడు, రిక్కగు సుతుం గనినైనను దేజు నూనఁడున్.

అంధకార ప్రబంధ నాయకుఁ డతండు
త్రుటిని బొడఁగనె విచ్చుకత్తుల తటిత్తు
అడరి సాయుధులై తండ్రి కొడుకు నిలువఁ
గలిపి కట్టిరి 'బహదూరుఖాను' భటులు.

'మల్లికాజీవను'ని ప్రక్కమఱుఁగు మొగము
కత్తి దులిచిన బహదూరుఖాను తెగువ
కానుపింపవ యొక్క 'ఖురా'నె గాని
రాతిప్రతిమయి నిలుచు 'దారా'కు నపుడు.



# ఉత్సవము

ఔరంగజేబు 'దారా'ను ఆడయేనుఁగుపై ఢిల్లీ పురవీథులం దూరేగించి పరాభవించెను. 'దారా' యూరేగింపు కథ యిందుఁ జిత్రితము.

''పాము కూసపుఁ బట్టు 'పగడీ'పయిన్ వెల్గు
            మేలి రత్నాల 'కల్గీల' తోడ
చలవల తెల్ల 'పాజామ'పై నాజాను
            పరిమాణమైన 'షేర్వాణి' తోడ
'ఖషు' 'సందలీ' 'కేవ్డ' గమగమ వలచి గు
            మాయించు రంగు రుమాలు తోడ
తాకిన జాఱు 'పాతాబా'ల పాదాలఁ
            గుచ్చు 'చడావా'ల కొమరు తోడ

చాది యలఁదిన రకపు 'ఖిజాబు' రంగు
కళలు పెనిచిన చిఱుచిబుకంబు తోడ
మురువు సూపిన దొర యేడ? క్రుంగిపోవు
రూప మిది యేడ? నీ దృశ్య మోప, దార.

అంసవాసమ్మునకు నించు కన్న దమ్ము
లా యవి, షరాయి, షేర్వాణి? యన్న కట్టఁ
బందుగకుఁ దమ్ముఁ డిడిన యుపాయనము లె?
బ్రదుకుతుది దెల్పు గుప్తసూత్రమ్ము లివియె?

పోసిన బొమ్మలై కళకుమోముల యోధులు మువ్వు, రుగ్రశా
తాసుల ముమ్మొనల్ ప్రభువు నయ్యయయో గుఱిసేసి, వాదరల్
కాసెడి తీక్ష్ణ తీక్ష్ణ రవికాంతుల క్రొమ్మిఱుమిట్లు పోసి, ల
జ్జాశిల చుట్టు నిల్చిరఁటె! ఛాదన లేని గజోపరిస్థలిన్.

నిగళ యుగళమ్మునం బదయుగళ మునిచి
శాఁకమున నడకొత్తిన పోఁకవైతె?
పండు నిప్పుకల్ చెరగు నీ మండుటెండ
ఘర్మ సలిల స్నపిత వపుః కలితుఁడైతె?.

ఈవు వాహ్యాళి వెడలిన యెల్ల యెడల
క్షుభిత వికలాంగ బధిర భిక్షుక కరాలు
తొంటిరోజుల బంగారు పంటచేలు
ప్రభువునకు నీకె కలవయ్యె బ్రదుకు నేఁడు

తొల్లి టంకమ్ము లోకపూటఁ జల్లినావు
సరిగ చేలమ్ము లోకనాఁ డొసంగినావు
రతనములు గుప్పె డొకరోజు రాల్చినావు
ఇప్పు డీమందభాగ్యున కేమి యిత్తు?

అని రోదించుచు నస్తి నాస్తి విచికిత్సాధార దేహాస్థి బం
ధన మూఁగాడఁగ నిల్చి యొక్కబడు గాదారా నతాస్యమ్ము వం
చి నివాళించెను దృఙ్మరీచికలు పుంజీభూతముల్ సేసి, వి
చ్చిన కన్నుంగవ విచ్చినట్టులయి నిశ్చేష్టాకృతిన్ యష్టియై.

ప్రాణముండియు లేని నిద్రాణజీవి
వాల్చిన మొగమ్ము ప్రజకుఁ జూపని విభుండు
పూర్వ జన్మ స్మృతిం బలె బోల్చికొంచు
సుంత కన్నెత్తె బీదభిక్షుకుని వంక.

తడఁబడి సొమ్ముకై తడవి సిగ్గిలి చేయి
వెలకిలవేసిన విన్నచూపు
తుకతుక నుడికి క్రుమ్మగ్గుకొని వచ్చు నెడంద
యంచుల నావిరియైన చూపు
పగిలి పాఁతులదాఁక నగిలి నెట్టియవడ్డ
యెడఁద లోఁతులు పట్టియిచ్చు చూపు
చచ్చిచావక సిగ్గు చచ్చి కట్టియవాఱు
నొడలి కన్నీరింతల వెడలు చూపు

సిరితొరఁగి యున్న పెనుదాత కరఁగు చూపు
మర్మ నిర్భేద కరమయి మాకొనంగ
కనుదుదలు వాల్చి ముదుసలి గడ్డుపేద
'ఓపలేను ప్రభూ! చూడ నోప ననఁగ.

కను లరమూసి నీరములు క్రక్కుచుఁ జూపుల సిగ్గు నొక్కుచున్
చినిఁగిన యంచులున్ నలిగి జీబులు రేఁగిన దారపుం గొసల్
మొనయు నిజోత్తరీయమునుఁ బుచ్చి, కరమ్మునఁ బట్టి, పేద మూఁ
పునఁ బడ రువ్వె నా మొగలుభూపతిపుత్త్రుఁడు వేపమానుఁడై.

తన వెన్కం జిఱు సంకెలల్ చరణ పద్మమ్ముల్ నిబంధింప, నె
ఱ్ఱని చెక్కిళ్ళకు వెల్లు వోయు కనులన్ రాపాడు బాష్పాంబువుల్
మునిగోటన్ విదిలించి సీత్కృతి శిరంబున్ వాల్చి వేవే 'సిఫీర్'
కనులార్చెన్ విగతాంసవాసజనకుం గానంగ మోమోడుచున్.

హాహారవాక్రంద నాలాపసహిత లా
లాట సంస్ఫోట కోలాహలమ్ము
కంకణప్రేంఖణాక్రాంత హస్తద్వయీ
గాఢసంఘర్షణాఖండరవము
శోకసంస్థాన వక్షోమంటప క్షోభ
కర నిరంతర కరాఘాతచయము
పుంజీభవత్కంఠ పూత్కారగాద్గద్య
లపిత దివ్యాక్షు 'రాల్లా' పదమ్ము

కళ లెడలు లోగిళుల ముంగిళులను వెడలి
వీథికాశ్రేణులం బడి వినఁగవచ్చె
ముసుఁగు చూపులఁ గని మొగల్ ముగుద లెల్ల
గుండియలు పిండిపోసి గగ్గోలు వడఁగ.

"అంత యేలిక కెంత యగచాటు వచ్చెనే
యల్లాకు దయలేద?" యనెడివారు
"మును పూలజల్లులోఁ జను జేని కీనాఁడు
కన్నీటి కాన్కలా?" యన్నవారు
"నెమిలి పించెపు గద్దె నీతిలేనిది గదే!
యనువైన దొరఁ దన్నె" ననెడివారు
"అతఁడెవ్వరు? సిఫీరె! అయొ తల్లి చచ్చిన
యనుఁగె? హా! కనలేమె" యనెడివారు

పుర పురంధ్రీమతల్లులు పొగిలి రంత
నుదుకు కుసిలింపు ముసుఁగు నిట్టూర్పు లూర్చి
దీర్ఘ రథ్యోభయప్రాంత దీప్త సౌధ
మాలికా ప్రాంగణ ముఖాల నోలి నిలిచి.

మూఁడు కాళుల ముదుసలి మోకరించి
దుఃఖవార్బిందుతతిఁ బట్టి దోయిలించి
"అన్న? నీ వెవరన్న? యిల్లైతి! మల్లె
పూప మొగ్గవు, నీత్కారమును బొనర్తు!

"అక్కటా! తల్లి తలఁగిన యనుఁగ నీవ?
ఈవుచేసిన యపకృతి యేమి తండ్రి?"
యంచుఁ బవడపు టెరజీర లామతించు
కనులఁ జుఱుకు చూపుల యుడుగరలు వెట్టి

"ఇట్టి ప్రభువుల కాఁడేనుఁ గెక్కు వ్రాత!
వెనుక నిరుప్రక్కలను గత్తిమొనల పోత!
పరిభుత కేమిలే! యెవరు శాశ్వతము? నేఁటి
శాటికత నిల్చు మొగలాయి చరిత పుటల."

అనెడి నిరుపేద మొత్తి యోధానుయోధు
లొత్తిగించిరి నడిపించి రుత్సవమ్ము
గంధగజపీఠి బహదూరుఖాను మేటి
యగ్రసరుఁడయి రాజకీయాజ్ఞ లీయ.

కాహళీ భేరికా మృదంగ పటహ గతి
నాలుబాలులు తీటి సహస్ర భటులు
కదను ద్రొక్కించు గుఱ్ఱాల పదువు కదల
మొనల వెనుక నత్యంతశోభనము మిగిలి

ఒడ్డు పొడుగు మేని కొరపైన జునపాల
శిరముపైఁ దెల్ల యుష్ణీష మెగుర
కండమల్పున నిప్పగుండోపు మూఁపులు
భుజకీర్తులను బొంగిపోయి తూఁగ
రవికాంతి మిఱుమిట్లు రగిలించు తెలివన్నె
బింకంపు విల్లు డాచంక నిఱుక
మిడిసి తళ్తళలాడు పిడితోఁపఁ దడఁబడు
తరవారి నడుము పెందట్టి వ్రేల

ఉక్కు గండరింపుల లీలఁ బిక్కులమరఁ
గనుల జేవురు పెరసెరల్ కణకణ మన
నెవరి యొకఁడె వందకు జవాబిడ గలాఁడు
మల్లికా జీవనుం డుత్సవోల్లసితుఁడు.

చిత్ర చిత్ర ప్రభా పత్ర రేఖా విధా
సమలంకృ తాంబ రాచ్ఛాదితమ్ము
మందార కుందారవింద నాగాశోక
పారిజా తోత్పల తోరణమ్ము
మరకత వైదూర్య మౌక్తిక వజ్ర ప్ర
వాళ నీల స్తంభ భాసితమ్ము
రత్నకంబళ మధ్య రంజత్సువర్ణాంక
రజత పాత్రాసీక రాజితమ్ము

మల్లికాజీవన కరీంద్ర మంటపమ్ము
ఇన సహస్ర కర ప్రసారణము నందు
ప్రాగ్గిరీంద్రము వెలువడు భాస్కరునకు
నుద్దియై వెల్గె మల్లికుఁ డొక్కరుండు.

ఉదయాదిన్ మొదలయ్యె నుత్సవము, రథ్యోపాంత సౌధస్థల
చ్ఛదమైనన్ వెలిరాదు చూడ, నగరీ సౌందర్య రేఖాంక సం
పద లొక్కమ్మడి పొంపవడ్డ, వయినన్ మధ్యాందినోద్యత్ప్రభల్
ముమురుందన్కఁ దదుత్సవమ్ము ముగియంబోదాయె ఢిల్లీపురిన్.

